# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1958

సంపుటము 35 : : సంచిక 10

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1958


వైజయంతిమాల పద్మిని వీరిని
అత్యున్నత స్థాయిలో చూడండి
జెమినీ చిత్రం
విజయకోట
తెలుగు
వీరుడు
అక్టోబర్ 2 మొదలు ఆంధ్ర దేశ మంతటా....


# నిర్వేదము

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

ఎచ్చట నుంటివయ్య పరమేశ్వర! నీవిని కావ్యలోక మం
దిచ్చకువచ్చినట్లు విహరింపగ నీయక సేవకత్వమే
పుచ్చుకొనంగ నాజ్ఞ నిడబూన, రసాబ్ధులు నీపదమ్ములన్
నిచ్చిన నన్నుజాజియరవిందములన్ గొలువంగ నెట్టులో।

భాగ్యముతోడ నీచరణ పద్మములన్ సతతమ్ము గొల్వగా
యోగ్యతఁగల్గ నిచ్చిన మహోజ్జ్వల నూతన సత్కవిత్వ సౌ
భాగ్యమునన్ ఉదాత్త రసవార్నిధి తేలెదగాని, పట్టిదా
ర్భాగ్య జగమ్మునన్ నిలువ వచ్చునె? యేకనిమేషమాత్రకై।

ఆశయముల్ హిమాలయ శిఖాగ్రములన్ బురుడించుగాని, నన్
ఏ శని పట్టెనో మొదటి కేనియు నించుక చేరలేక, నా
యాశల నీటగల్పుకొని యంధుడనై యిట కూలియుంటినో
ఈశ! పరేశ!! నన్ను కరుణించి యొసంగుము పూర్వసంస్కృతిన్॥

ఈ యెద నొక్కమారు పరికింపుము, నాదు దురంత వేదనన్
వ్రాయగజాల పద్యముల స్వామి! అశక్తుడ నంచు తెల్పగా
నా యభిమానమున్ వదలినాడను లే!! యిక శంకలేల, నే
నీ యనురాగ గీతకమనీయసుధారసమానెదన్ ప్రభూ॥

ఈ గుడిబండ దాల్చి యిక యెన్ని దినాలని జీవితమ్ము నే
లాగగలాడ తండ్రి? కనులం జలియించుచునుండె ప్రాణమే
లాగునవైన బ్రోవగ తలంపనిచో నిముసమ్ము యేని నే
నాగగ జాలనట్టి చలితాత్ముడ నైతినయా! పరాత్పరా॥

ఆశరదిందు చంద్రికల ఆసికతాతలవేది చేరి నా
ఆశల నెల్ల నీకు తెలియంగ కవిత్వమునల్లి, అల్ల ఆ
కాశమునందు తారకల గానముతో శ్రుతిగల్పునట్టి భా
గ్యాశయ మబ్బునయ్య పరమాత్మ!! విమేషపు జీవితమ్ములో॥

ఆశయహీన జీవితమె హాయిగ నున్నటు తోచు, వెఱ్ఱి యా
వేశము పెచ్చుమీఱ వినువీధిని సౌధము పైన సౌధముల్
కౌశల మొప్పగట్టితి సుఖమ్ముగ నుందమటంచు, నింతలో
రాశిగఁ జేసి యన్నిటి పరాత్పర! రంజిలుచుందు వాత్మలోన్॥

నీవే నేనయి నేన నీవయగుచున్ నిత్యప్రబోధమ్ముతో
భావావేశ రసైక జీవిత సముత్పన్న ప్రమోదమ్ముతో
నీ విశ్వమ్మున నుండు భాగ్య మది లేనేలేక యల్లాడు నే
నీ వాత్సల్యరసమ్ము నానుటకు తండ్రీ! ఎంతో కొట్టాడదన్॥

జీవిత మగ్గలం బగుట జీవికయంత్రమునందు జిక్కి, నా
నా విధమైన యాతనల వగ్గి కృశించితి తండ్రి! నూత్న సం
జీవిని నిచ్చి సంస్కృతి విశేష సమంచిత దివ్యమార్గ సం
భావితుఁ జేయవేడెద కృపాకర వీక్షణ! సాధురక్షణా॥

నాదు జీవిత మనెడి విషాద గీతి
నీవు రచియించి నా కిడినావు గాని
శిథిల పాట ఆలాపన సేయజాల
దీ హృదయవీణ, నీవు ప్రేమించునటుల॥

ఎన్నటికైన వికసించు నీ ముకుంద
మొగ్గయని తలంచితిగాని మోసపోతి
అమిత కఠిన కర్కశహృదయమ్ముతోడ
తోడిమనుజుకును దీనిని త్రుంచినావు॥

ఏమి మూటగట్టెదవు? కానిమ్ము స్వామి!
ఆగిపోవను క్షణమాత్రమైన జన్మ—
ఈ విషాదాశ్రువులను జీవించువాడ
సతతమును నీదు నామసంస్మరణతోడ॥

లంటే ఒకరోజు, అది నీకు అర్థంకావాలంటే ఒక సంవత్సరం, దాన్ని నువ్వు అమలులో పెట్టాలంటే ఒక శతాబ్దం పడుతుందిరా మై డియర్! కాబట్టి మామయ్యల్లో చెబుతాను విను. జీవించడమనేది ఒక కళ. ఆ కళని ఆధారం చేసుకుని మూడు ఉపకళలున్నాయి. ఒకటి అప్పుచెయ్యడం, రెండు అబద్ధాలాడడం, మూడు వేషభాషలు ప్రస్తుత నా నిరుద్యోగ నిర్వాసన నిరాహారదినాలలో ఈ మూడింటిలోనూ గొప్ప ఎక్స్‌పర్ట్‌నైపోయానుకో

రంగ నిజం!

శేఖరం : నిజం. (విషాదంగా) ఏం చెయ్యమురా బ్రదర్ చెడ్డవాణ్ణి అనుకోకు మనలాంటి మధ్య తరగతి యువకులకి యింతకన్నా ఆస్కారం ఏముంది గౌరవంగా స్వేచ్ఛగా జీవించేందుకు మార్గాలు లేవు అలాగ అని స్వతంత్రాన్ని హృదయాన్ని చంపుకోనూ, ఆకలినీ అకలిని కట్టుకటి సైకు కాలువలో పారేసి జీతం డబ్బులకోసం బ్రతకడమనేది—మై గాడ్—నే సహించలేనురా

రంగ అవునుగాని నీకు అప్పు ఎవడిస్తాడంటా? మాట యాభైరూపాయల నికరమైన రూపీ సంపాదన వున్నా వాడే పుట్టడు

శేఖరం అందుకే అప్పుచెయ్యడం కూడా ఒక కళ అన్నానురా మిసర్ మాటవరసకి మన ఫ్రెండు గణపతిని ఎరుగుదువా?

రంగ తెలియకేం—ఆర్ అండ్ ఆర్ ఫరమ్‌లో పని చేస్తున్నాడుగా.

శేఖరం వాడికి మర్యాదంటే ఎంత కురీ, ఎంత గౌరవమూ, ఎంత విశ్వాసమూ ప్రయోజకుడివనీ తెలివైనవాడివనీ

రంగ : అవునవును పాపం వాడికి నేనంటే అమిత అభిమానం.

శేఖరం : అవునా! మొన్న నే సేం చేశానో తెల్సునా. అర్జంటు అవసరం వచ్చింది ఒక్క పాతికవుంటే యివ్వరా బ్రదర్, మన రంగడు నా కివ్వవల్సిన పాతికా నీకు యిచ్చేస్తాను, పాపం వాణ్ణి ఈ పెళ్ళాళ్ళ గోలల్లో ప్రెస్ చెయ్యడం నా కిష్టం లేదురా అని ఓ పాతిక రూపాయలు సంపాదించాను

రంగ (తెల్లబోయి) నేను నీకివ్వాలటా? నీ మొహానికి నాకు అప్పుపెట్టే స్తోమతు కూడా వుందా! ఏం గుండెలురా నీది ఎంత అబద్ధం, పచ్చి వలని అబద్ధం

శేఖరం అబద్ధం నల్లగా ఉండదురా బాయ్ జర్మన్ సిల్వర్‌లా తళతళమని మెరుస్తూ నిన్ను లోబరుచుకుంటుంది. సత్యం నిజంగా నల్లగా ఎక్కడో మూలపడి ఉంటుంది.

రంగ ఇంత ఘోరంగా ప్రవర్తిస్తావనుకోలేదురా.

శేఖ భంగారు పడకురా రంగడూ ఆపదలందు ధైర్య మన్నాడు భర్తృహరి అనే అమెరికన్ పొయెట్

రంగ నేను వెళ్ళి గణపతికి నువ్వు చేసిన మోసం చెప్పేస్తాను

శేఖ చెప్పరా! చెప్పినంత మాత్రాన తల తీసేస్తాడా ఏమిటి—ఇంతకీ స్నేహితుడుకదా! పోనుకాని బ్రదర్ ఒక్క అయిదు రూపాయలుంటే (చెయ్యి చాపుతాడు.)

రంగ (కంగారుగా) ఒరేయ్ నాకు మస్కా కొట్టుతున్నావేమిటి

శేఖ : సరే (నవ్వుతాడు) అలవాటు చొప్పున అడిగాను 'తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు, దుంపటికొమ్ము సాధింపవచ్చు కానీ చంపినా చచ్చినా రంగనాథునినుండి కానీ రాలదెపుడు' అన్న లోకోక్తి ఊరికే పోతుందా

రంగ : థాంక్స్ డబ్బువిగర మనకి చాలా గట్టి అనుభవముంది మిత్రమా!

శేఖ (ఇటూ అటూ చూసి) ఒరేయ్ రంగడూ. ఇంక నువ్వెళ్ళిపో

రంగ ఏం యిక్కడ నిలబడకూడదా.

శేఖ : ప్లీజ్ ఆ అమ్మాయి వచ్చే వేళయిందిరా.

రంగ అమ్మాయా! ఎవరా అమ్మాయి? ఎవరి అమ్మాయి తదితర గుణగణాలేమిటి. సవిస్తరంగా చెప్పు.

శేఖ సుచిత్ర

రంగ సుచిత్ర! ఉషాధికారి రామనాథంగారి అమ్మాయి!

శేఖ : ఎగ్జాక్ట్లీ.

# విచిత్ర ప్రణయం

రంగ: అయితే!

శేఖ: ఇంకా నీకు తెలియదురా రంగడూ నువ్వే లోకంలో ఉంటున్నావో నాకు అర్థం కావటం లేదు. భవదీయుడు శేఖరంయొక్క జీవిత చరిత్రలోని యీ గొప్ప అధ్యాయాన్ని విస్మరించావని తెలిస్తే—భావి చరిత్రకారులు నిన్ను మెచ్చరురా

రంగ: అసలు సంగతి ఏమిటో ఏడుద్దూ

శేఖ: ఆ అమ్మాయిని నేను ప్రేమిస్తున్నాను. కాలేజీ వదలిన ముహూర్తంనుండీ యిదే మన జీవితాశయం నువ్వొక్కడివితప్ప యీ విషయం తెలియనివాడు మన దేశంలోనే లేడు

రంగ: అదేదో ప్రేమించటం అనే పని చేస్తున్నావని తెలుసునుగాని నీ ప్రేమకి లక్ష్యమైన దురదృష్టవంతురాలెవరో తెలియదు. అయినా, నువ్వందర్నీ ప్రేమించెయ్యొచ్చును తప్పులేని వ్యవహారం.

శేఖ: ఇదా నువ్వు చెప్పేది అసలు నీకు ప్రేమంటే ఏమిటో తెలుసునా! ఆ ప్రేమించే తాహతూ, హృదయమూ నీకు ఉన్నాయా! నువ్వు కీట్సునీ కృష్ణశాస్త్రినీ చదివావా! రాత్రిళ్ళు మల్లెపూలు వాసనచూస్తూ ఏడుస్తూ పక్కమీద దొర్లావా! పోనీ ఎప్పుడైనా చంద్రోపాలంభన అయినా చేశావా! కరుగట్టిన గుండెగల నువ్వు నా ప్రేమని విరసించటం అంధుడు సూర్యకాంతిని ఆక్షేపించినట్టు ఉంటుంది

రంగ: నా మాటకేంగాని, ఏదైనా ఫలితం కనపడుతోందా!

శేఖ: ఆ అమ్మాయి చాలా బెట్టుగా వుంటోంది. ఎన్నో లవ్ లెటర్స్ వ్రాశాను. మా నాన్నకి చెబుతాను, మా ప్రిన్సిపాల్‌కి చూపిస్తాను అని బెదిరిస్తుంది కాని ఏ ఒక్కటీ చెయ్యలేదు. ఆవిడకి మనం అంటే యిష్టమున్నట్టు అదే దాఖలా అనుకో

రంగ: అనవసరంగా తానుకూడా రచ్చకెక్కవలసి వస్తుందనే భయంవలన ఆమె గప్‌చిప్‌గా ఊరుకుని వుంటుంది. కాక, అది నీ మీద ప్రేమగా భావిస్తే నీ కామన్‌సెన్సునిగురించి సందేహించవలసి వస్తుంది.

శేఖ: స్త్రీ హృదయం నాకు బాగా తెలుసునురా మిస్టర్! ఆమె పైకి చూపే విముఖత, కోపం వెనుక ఎంత ప్రేమవుందో, ఆమె ప్రవర్తనా, వ్యవహారమూ చెప్పుతూనే ఉన్నాయి. ఒరేయ్ బ్రదర్! ఒక్కొక్క ఆడది ఒక్కొక్క రకం వీణ అనుకో ఎవర్ని ఎలా మీటి పలికించాలో అదొక బ్రహ్మాండమైన కళ ఆడది మంచి గంధం చెక్కలాంటిది గంధం చెక్కని రాయగా రాయగా గంధాన్నిస్తుంది. అలాగే ఆడదాని చుట్టూ తిరగా తిరగా ఓ ఫైన్ మార్నింగున 'ఏమండోయ్ మిమ్మల్నే నేనూ ప్రేమించేస్తున్నాను' అని చటుక్కున అనేస్తుంది

రంగ: నువ్వు వట్టి పిచ్చికలవాడివిరా శేఖరం కథలు వ్రాయడానికి, నాటకాల్లో వేషాలు వెయ్యడానికి పనికొస్తావుగాని లోకాన్ని అంచనా వెయ్యలేకపోతున్నావురా ఒకవేళ ఆ అమ్మాయి అంత బుద్ధిలేనిదై నీలాంటి లోఫర్ని ప్రేమించిందే అనుకో, వాళ్ళనాన్న నిన్ను ఓ పెయిర్ ఆఫ్ టాంగ్సు (Pair of tongs) తో ఓ పురుగుని ఏరినట్టుగా ఏరి గోడ అవతలికి విసిరెయ్యడూ!

శేఖరం: ఒరేయ్ నువ్వు కురూపాని కురూపా ఎవడికీ జీవితంలో కోరుకున్న నిజమౌతుందనీ, అన్నీ కాకపోయినా కొన్ని అయినా సుఖాంతం అవుతాయనీ నమ్మకం పోతుందిరా వట్టి సినికల్ గా అయిపోతాడు చూడు ఈ అమ్మాయి రఘునాథంగారి ఏకైకపుత్రిక అందులో గారాబుపట్టి, అర్ధరాత్రివేళ ఆమె లేచి ఇప్పుడు నాకు సూర్యకాంతి కావాలి అంటే ఈయన తక్షణం గగనమార్గంలోకిపోయి సూర్యభగవానుణ్ణి జబ్బపట్టుకు తీసుకు వచ్చేస్తాడంటే నమ్ము. అటువంటప్పుడు ఈమెని కాదనగలడా. అరెరె! ఆ అమ్మాయి యిటే వస్తోంది. క్లోజ్ గెటవుట్.

రంగ: ఏది ఆవిణ్ణి ఒక్కసారి చూడనియ్యి.

శేఖరం: ప్లీజ్. పోరా పోరా (భుజం పుచ్చుకుని లాక్కుపోతూ) అబ్బబ్బ! యీ రోడ్డుమీదైనా

# మర్యాదలు

శ్రీ జానూతల వేంకటరామమూర్తి

'చదువుకున్నందుకూ, ఉద్యోగాలు వెలిగిస్తున్నందుకూ మనం ఒకొక్కరయినా గొప్ప సాయం చేస్తే దేశంలో ఇంతింత లాభాటి సమస్యలు ఉన్నాయా నేమా! నచ్చినా సులభంగా తేలిపోతవి!'

'ఔనౌను!' పరధ్యానంలో అన్నాను

'నేనెంతటి ముఖ్య విషయం చెబుతున్నానో నీవు అర్థం చేసుకుని వీరిలో బాగా తలవి నమ్మ లేను కట్నాలు ఇవ్వలేక పెండ్లి వాయిదా పడు తూంటే, చాటున కన్నీళ్లు కుక్కుకుంటూ ఎంతగా గిలగిలలాడుతూ, ఎంతగా తపించిపోతూ మగవాడిని కవించి వేస్తున్నారో ఎప్పుడైనా ఊహించడం జరిగిందా? నేను కండ్లారా చూశాను!'

'లేదు!' అంటూ కండ్లు వాడివైపుకు తిప్పాను నందకుమార్ కండ్లలో ఎర్రటి జీరలు - మామూలుగా ఉండేవి కనిపించాయి కండ్లు ఎర్రటి జీరలతో ఉండటం భాగ్యచిహ్నమని వాడు తరచు అనేవాడు కుమార్ మళ్ళీ మొదలెత్తాడు, 'కనీసం ప్రతివాడు కట్నం తీసుకోనని ఎందుకు తీర్మానం చేసుకోరాదూ?'

'ఈ విషయంలో ఒక చట్టంకూడా ఉంది ఇది చాల పాతపాట! ఇంతకూ నీవు తీసుకోడం జరిగిందా?'

'అం మనసా నిశ్చయించాను లేవు ఇరవై రెండు నా పెండ్లి!' అన్నాడు నందకుమార్, వీలున్నా విడక వెళ్లిపోయాడు.

నేను ఆశ్చర్యంతో కొయ్యబండి పోయాను!

అతి మామూలుగా వాడి పెండ్లి జరిగిపోయింది, కాబట్టి అరుచైలంగా నేనూ చెప్పడంలేదు పసుపు దారులయిన బట్టలతో, శిరస్సునుండి విస్మయం రాలు తూంటే చిరునవ్వులతో పరాపరి నా దగ్గరకు వచ్చి, 'ఎల్లా ఉందిరా?' అన్నాడు నందకుమార్.

'ఏమిటి'

'నా పెళ్లాం!' వాడి ముఖంలో గర్వం, తోకా రాలూడు కవళికలు మెరుస్తున్నాయి!

'నీకు సరిపోతుంది!'

ఇంతలో వాడి పెద్ద బావమరది గబగబ్బున వచ్చి 'ముఖ్యంగా మిమ్మల అభినందిస్తున్నాను మీ లాంటి మిత్రబృందం ఉండటంవల్లనే సంస్కారవంతు లావటూ, స్వేచ్ఛా ప్రయత్నాలూ కలుగుతుంటాయి ఇల్లాంటి పుణ్యకార్యం చూసినప్పుడు నా కండ్లు చెమ్మగిల్లుతుంటాయి వీరిని నేను అభినందించేది!'

'చేసిన మెప్పు చాలదూ? కొరదా, చరవా మీ కల్లాలు మూసుకోగలదు!' అంటూ పైకి నేను అనలేదు,

నందకుమార్ ఉదాత్తమైన అతలోకాలు మూ శౌర్యమండి లోపల వైపుకు ప్రసరించాయి నేనూ అటే చూస్తున్నాను కాబట్టి, మెరుపులా తళుక్కున మెరిసి పోయిన వాడి మరదలు కనిపించింది

'మేము చూడండి ఎంతో కష్టపడాం! ఇంక ఒకమ్మాయి సగుణగా మించోగలిగాము ఇది సంతోషంగానే ఉంది. మా నాన్న మాకోసం ఏమీ మిగల్చలేక పోయినా, ఇద్దరి పెండ్లాడాల్సిన చెల్లెళ్ళను వదిలి పోయాడు ఎంత కష్టమో ఆలోచించండి! పాటలూ, బట్టలూ జరుపుకోడమే ప్రహ్లాంపెనువుతూంటే, ఇంకా వెలకు వెలు ప్రకృతిందనం సామాన్యమా?' అని అతడు ఒక నిముషం కూడా విరామం తీసుకోక, 'నందకుమార్ విశాలహృదయుడు కాబట్టినే, ఎవరెన్ని కెంత అనిపమైనా తన ఆశయాన్ని దక్కగా ప్రదర్శించి కృతార్థుడైనాడు!' అని అతడు వెళ్ళి పోయాడు

అతడి ధోరణి, తత్త్వమూ నేను అప్పుడు బాగా అర్థం చేసుకోలేకపోయాను.

'మంచి బావమరిది నే సంపాదించావ్!'

'అయిననేంలే 'య్! గజెటెడ్ రాంకులేదనేగాని, సెంట్రల్‌లో అంత జీతంవచ్చే ఉద్యోగం!'

'ఆయన తమ్ముడో!'

'లెక్చర్ చేస్తున్నాడు!'

కలదు. గాని అది ఎండకు, వానకు తట్టుకొనలేదు. కేవలం రోజన్ కిరసినలో కరిగించుటవలన, ఒక నాసి రకం రోజన్ వార్నిష్ వచ్చును

విశేష మేమిటంటే, ఇండియాలో రోజన్ వార్నిష్, "కోపల్ వార్నిష్" అను పేరుతో అమ్మబడుచున్నది

కోపల్ వార్నిష్ మాదిరిగా రోజన్ వార్నిష్‌ను తయారుచేసినచో, అనగా సున్నంతో సంపుటి జరగనిచో అది అంటుకునే మెత్తనిపొర (Film) నిచ్చును. దీని నివారణకు, లైమ్‌చేర్చి రోజన్‌ను గట్టిపరచెదరు. రోజన్‌లోని ఆమ్లము (Acid) సున్నముతో కలసి కాల్షియం రోజినేటు అగును. గట్టిపరచుటకు ఇతర వస్తువులను కూడ వాడెదరు. రోజినేటు వార్నిష్‌లు గట్టి, తళుకుగల ఫిలిమ్స్ నిచ్చును. కోపాలు వార్నిష్‌లను కల్తీచేయుటకు వాడుదురు. రోజినేట్ వార్నిష్‌లు శాశ్వతమైనవి కావు. ముఖ్యంగా నీటిని ఎంతమాత్రము సహించలేవు. త్వరలో అగు పెయింట్లలో హెచ్చుభాగం కాల్షియం రోజినేటు యుండును. మంచిరకం రోజన్ వార్నిష్‌లు కొంత భాగంగాని, పూర్తిగా గాని అవిశనూనెకు బదులుగా టంగ్ ఆయిల్‌తో తయారుచేయుదురు. ఇట్టివి ఇండియాలో చేయడంలేదు

బ్లేక్ వార్నిష్‌లు కోపాల్ వార్నిష్‌లో కొంత భాగము కోపాలుకు బదులుగా, "ఆస్ఫాలం" వాడి తయారుచేసిన వార్నిష్‌ను, "బ్లేక్ జపాన్" అందురు. బ్రన్స్‌విక్ బ్లేక్ ఇటువంటిదే గాని ఇందు కోపాలు ఉండవు. ఇందు అస్ఫాల్టం, లిన్సీడ్ ఆయిలు, థిన్నర్సు మాత్రముండును

ఒక రకం వార్నిష్ కేవలం అస్ఫాల్టంను పెట్రోలియం డిస్టిలేటులో కలిపిన వచ్చును. ఇంకొక రకం, "పిచ్చ్" (Pitch) ని కోల్‌టార్ సాల్వెంటులో కరగించుటచేత వచ్చును. వీనిని అందమైన పేరుతో అమ్ముదురు. నీటిని చొరనీయవు. ఉపయోగకరమైన చౌకరకం పెయింట్లు యివి

## పెయింట్లు తయారుచేయుట

ముఖ్యమైన దశలు: ముడిరంగులను పెయింట్లకు పనికివచ్చునంత మెత్తగా నూరుట, స్టిఫ్ (ముద్ద) పెయింటు తయారుచేయుట, ఈ ముద్దను బ్రష్‌తో వాడుటకు వీలగునట్లు, "రెడీ (Ready)" చేయుట.

స్టిఫ్ (ముద్ద) పెయింట్లు పెయింటు ఫ్యాక్టరీ హెచ్చుభాగం స్టిఫ్ పెయింటునే తయారుచేయును. ఈ స్టిఫ్ పెయింటును తృప్తికరముగా విక్రయించుకొనవచ్చును

రెడీమిక్స్‌డ్ పెయింట్లలో నూనె పయికి తేరి రంగు అడుగునకు పేరుకొనును. కాని విక్రయించిన యీపేస్ట్ పెయింటును, అవసరమగునప్పుడు పనికి తగినట్లు థిన్నరు చేర్చి, "రెడీ" చేసుకొనవచ్చును

కేవలం రంగు, తగినంత నూనె థిన్నర్సు చేర్చుట వల్ల మంచి పెయింటు తయారు కాజాలదని అనుభవం వల్ల తెలిసిన విషయంగాన, "రెడీమిక్స్‌డ్," పెయింటుకు కూడా తొలుత స్టిఫ్ పెయింటు తయారుచేయుట అవసరము

తరచు ఈ స్టిఫ్ పెయింటు ముడి ఆయిల్‌తో తయారుచేయబడును. రంగునుబట్టి చేర్చవలసిన నూనె పరిమితి విధిగా మారుచుండును. నూరు తులముల బేరైట్సు గాని, వైటులెడ్ గాని నూరుటకు 8 తులముల నూనె చాలును. కాని కొన్ని రంగులు నూరుటకు నూటికి నూరు తులములకు పైగా కావలసియుండును నూనె

పెయింట్లు నూరుటకు ట్రిపిల్ రోలరు మిలు మంచిది. రంగును, నూనెను పూర్తిగా కలుపుటయే దీని ముఖ్యోద్దేశ్యము

పెద్ద పెద్ద ఫ్యాక్టరీలలో స్టిఫ్ పెయింటుకు తగినంత నూనె, థిన్నర్సు చేర్చి, లోపల తిరిగే ఆకులుగల గొట్టములలో వేసి, కలియదిప్పి, "రెడీమిక్స్‌డ్ పెయింటు" క్రింద తయారు చేయుదురు. ఇందు వాడు నూనె బోయిల్డ్ ఆయిల్. టర్పెంటైనులో టర్పెంటైన్ ప్రతినిధి తగు రీతిని కలిపినదానిని "థిన్నర్"గా వాడుదురు. కొన్ని వేళలలో కేవలం కిరసన్ తైలపు ప్రతినిధిని మాత్రమే థిన్నరుగా వాడుటయు గలదు. డ్రయర్సు స్వల్ప పరిమితిలో చేర్చెదరు

లిన్సీడ్ ఆయిలు, టర్పెంటైను, టర్పెంటైన్ ప్రతినిధులు అన్నియు బజారులో దొరకును

పెయింటు తయారుచేయుట, అనగా రంగును నూనెలో నూరుట; తరువాత తగినంత నూనె, థిన్నర్సు చేర్చి బ్రష్‌తో వేయుటకు వీలగునట్లు తయారుచేయుట, తగిన మెషినరీ, అనుభవంగల పనివారు ఉన్నచో పైప్రకారం పెయింటు తయారుచేయుట కష్టమైన పనిగాదు.

గాని, లాభప్రదంగా నిర్వహించుటకు తగిన మెషినరీ, శిక్షగల పనివారు, అనుభవంగల మేనేజిమెంటు అవసరము.

# జ్యోతిరవతరణము

శ్రీ వి. రామరాజు

వెలుగులు విచ్చుకొన్నవి, న పింఛ మనోజ్ఞమయూర నర్తనో
జ్జ్వల రుచిరంబులై, లలితచాలన హేలలు వాన్తరంగ శీ
తల మృదులంబులై, ఇవము తాకని శ్రీజలజాప్త కాంతి రే
ఖల తొలిజాలులై, ఉషసికట్టిన బంగరు టంచుచీరలై.

మూగిన మల్లె మొగ్గలను మాదిరిగా, లలితేంద్ర నీల మా
లా గలిత స్ఫురచ్చికుర రమ్యముగా, తెలిసీటి ముత్తెముల్
తూగని పచ్చగడ్డికొన తూగులుగా, వెలుగుల్ వెలార్చె హం
సీగరుదంచలాకలిత చిత్ర సువర్ణ ఘృణీకలాపముల్.

ఒక పదివేల శక్రధను రుజ్జ్వల కాంతులు మొట్లు మొట్లుగా
శకలితముల్, నభమ్ముపయి సాగిన నీలి మొయిళ్ళ నిండ వి
చ్చుకొనియె—దుఃఖభావ వివశుండగు జీవుని యార్తి యద్భుతం
బు కనినవేళ కప్పబడిపోవును తద్గత నూత్నతాక్తమై.

ఈ వెల్గుల్ జడివోలె వచ్చె-నిటులే యేకాంచెమో సేపు నా
లో విప్పారును వాసనల్, ఎడద్రవాలుక బుద్ధిపోలున్ జలే
జావాప్తంబుల నేత్రచక్రముల వేలంచుల్ తుదల్ కంటి నీ
రై వ్రేలాడును వేదనానుభవ ముగ్ధాకార పర్యాప్తముల్.

ఏవో ఊహలు పెల్లగించుకొని యిట్లే వెల్గులో కాల సీ
మా వృత్తింజననో? పురావిదిత సౌఖ్యాస్వాద ముగ్ధంబులౌ
భావంబుల్ మలినంబులైచనెను, నా ప్రాణంబులన్ నూత్న వర్షా
విద్యుల్లతికా ముహుశ్చలనముల్ రమ్యార్ఘ సౌగంధ్యముల్

లలితేరమ్మదప్రాణవీధికల హేలా జ్యోత్స్నాకాకాశ కే
ళులు పారావతముల్ కలస్వనఝరీలోలమ్ములై సాగడిన్
పెల రేఖై మృదుకాంతి యొక్కెడు మన స్నేహావధుల్ దాటిక్రాం
బులకల్ గూర్చుచు బుద్ధి దేశమున క్రమ్మున్ జీవనస్వాదువై

మత్తానేకప యానలై, సురపరిమ్మంజు ప్రసూనాగ్రని
ర్యత్తారుణ్య మధుద్రవ స్స్రవాలు, చిత్తానంద సీమావధుల్
మత్తం జూపుల అచ్చరల్ పరచిరా? మీనాళి పుచ్ఛచ్ఛవుల్
చిత్తాంభోరుహ నాళ కంపన మృదుస్నిగ్ధంబులౌ పైటలన్

చీకటులాక్రమించుకొని జీవన మందున మూలమూలలన్
ప్రాకి, సమస్త భావముల రమ్యత చంపి, క్షణక్షణమ్ము శో
కైక మహానుభావమునిపించును, జీవునిలోని కాంతిధా
రా కమనీయ మార్గవితరంబుగ నిల్చును యిన్పతల్పులన్

కరగిన చీకటుల్ వెలుగుగా కనిపించును కొందరజ్ఞతా
పరమ నిధానమోహులకు — బంధుర కాంతులుమాసి పోవగా
కరకర చీకటుల్ విరియు, కన్నులు మూతవడంగ చేతన
త్వరథము గోతికూలు తెగవంచిన విల్లుగ ముక్కలై చనున్

అపరోపన్నమహార్ద్రి సూర్య కిరణా హంకారమున్ వార్ధి పీ
చి పురస్తాడన చిత్రవల్గనములై చెల్వొందు కాంతిచ్ఛటల్
ఎపుడో జీవితమందు కానరయి నిల్చినిల్వకుండన్ నిమే
ష పదమ్మందు మనస్సు నవ్యసుషమా స్థానంబుగా దీర్చుడున్

ఈ కాలాణువుకోసమై బ్రతుకు లెన్నో యయ్యె నా జీవిత
ప్రాకారమ్మున, చీకటింబారలు కృత్తానల్పముల్, కాంతి వ
ర్షా కాలంబరుదెంచె, నాయెడద ఈవర్షమ్మునిల్చెన్ మనో
జ్ఞాకాశంబున తోడి స్పర్థపడి నవ్యాంబోధిగా నిల్వగా.

తెలియని సిగ్గుదొంతరలు దివ్యములైన పథాలలోన పా
ముల పలె జారిపోవ నవమోహన గీతము లాలపింతునా?
లలిత పయోధరాంచలమున్ నెలవంకలు దిద్ది తీర్చునా?
మలచి మనస్సులో వెలుగు మార్గములన్ పరుగుల్లుపెట్టనా?

పాట పూర్తయింది. పాటకి ప్రతిధ్వనిలా వయొలిన్ మీద రాగాలాపన సన్నగా వినిపిస్తోంది. విశ్వం తేరుకొని ధైర్యం గా లోపలికి అడుగు వేశాడు. తలుపు చప్పుడు విని వసంత తలెత్తి విశ్వాన్ని చూసి ఆశ్చర్యపడి వయొలిన్ కింద పెట్టి లేచి నుంచుని "రవిగారా!" అంది.

విశ్వం చిరునవ్వు నవ్వాడు

"మీ పాటకి అడ్డొచ్చినట్టున్నాను"

"లేదండీ అలా కూర్చోండి." అంది వసంత

"ఇవాళే మా పరీక్షా ఫలితాలు వచ్చాయి. నేను సెకండ్ క్లాస్‌లో ప్యాసయ్యాను" అన్నాడు. విశ్వం కుర్చీలో కూర్చుంటూ

"చాలా సంతోషమండి" అంది వసంత

"మరి మీ టీపార్టీ సంగతేమిటి?" అన్నాడు విశ్వం కొంచెం చనువు తీసుకుని

వసంత ముఖంలో విస్మయం తొంగిచూసింది "ఏం టీపార్టీ?" అంది అప్రయత్నంగా

"మర్చిపోయారన్నమాట. నేను ప్యాసైతే మీరు టీపార్టీ ఇస్తానన్నారుగా. మరి అందుకడిగాను"

వసంత ముఖం ఎర్రబడ్డది ఆమెకి తన మాట జ్ఞాపకం వచ్చింది ముందే ఆ సంగతి తనకి జ్ఞాపకం రానందుకు ఆమెకి సిగ్గుగా ఉంది తను ఆమాట అన్నప్పుడు చాలా మనఃపూర్వకంగానే అన్నది తన ఇప్పటి ప్రవర్తన చూసి ఏమనుకుంటున్నాడో ఆయన!

విశ్వం ఆమె ముఖ కవళికల్ని గమనించాడు ఆమె వాగ్దానం మర్చిపోయి అందుకు సిగ్గుపడుతోందని గ్రహించాడు. తను అనవసరంగా ఆమె మనసుకి కష్టం కలిగించాడు.

"ఊరికే అన్నాలెండి. మీరు నిజంగా నేను ప్యాసయినట్టు చెప్పి పోదామని వచ్చాను." అన్నాడు విశ్వం తన తప్పును సరిదిద్దుకోటానికి ప్రయత్నిస్తూ

వసంత చిరునవ్వు నవ్వుతూ, "నోటీసు ఇచ్చి పోటానికి వచ్చారన్నమాట." అంది.

విశ్వం నవ్వాడు.

"ఇప్పుడే వస్తానుండండి" అని వసంత లోపలికి వెళ్ళి కొంచెం సేపట్లో కాఫీ కప్పుతో తిరిగివచ్చి బల్ల మీద పెట్టింది.

"ఇప్పటికిదే ఇచ్చుకోగలనండీ. క్షమించాలి"

విశ్వం మొహమాట పడ్డాడు అప్పుడే ఇంట్లో తాగివస్తున్నానన్నాడు ఆమె బలవంతం చేసింది. మరేమీ అనకుండా కాఫీ తాగేడు అతను

"మీరు చాలా మంచివారండీ ఏదో అన్నానని అనుకోకుండా జ్ఞాపకం ఉంచుకుని వచ్చారు"

'మరి ఊరికే వచ్చేదాన్ని వదులుకోమంటారా?'

వసంత చిరునవ్వు నవ్వింది

"మీరు రిహార్సల్స్‌కి రావటం లేదేమండీ? రోజూ చూస్తున్నాను"

"నాకోసమా?"

"అవును"

"ఎందుకూ?"

వసంత తెల్లబోయింది అతనలా అడుగుతాడని ఆమె అనుకోలేదు ఒక క్షణం అతని ముఖంలోకి చూసి అంది

"రవిగారు కదూ? హావభావాలు ఎలా ఉండాలో సలహా ఇస్తారని"

తన అనాలోచితమైన ప్రశ్నకి ఆమె ఇచ్చిన సమాధానం విశ్వానికి నచ్చింది

"నాకు నటనగురించి ఏమీ తెలీదు."

"తెలియకుండానే మెచ్చుకున్నారన్నమాట"

విశ్వానికి ఏమనటానికీ తోచలేదు ఆలోచించి అన్నాడు

"మెచ్చుకోటానికి శాస్త్ర విషయాలు తెలియాలా?"

"మెచ్చుకోదలచుకుంటే చాలు."

సంభాషణలోని అమాయకత్వానికి విశ్వం ఆమెని మనసులోనే పొగిడాడు

"పోన్లెండి మీకేమీ రాదంటాను సరా?"

ఆమె సమాధానం చెప్పకుండా చిన్నగా నవ్వి ఊరుకుంది.

"ఇంతకీ మీరు రిహార్సల్స్‌కి ఎందుకు రావటం లేదో చెప్పనే లేదు."

"ఇష్టం లేదు"

"ఏం?"

"ఆ వాతావరణం నాకు నచ్చదు."

ప్రారంభం కాబోతుందని మైక్ లో ప్రకటించారు. ఆడిటోరియంలో లైటు ఆరిపోయాయి తెర తొలగింది.

దృశ్యం ఒక పల్లెటూరులో పండు వేళాల జరుపుకునే ప్రదేశం సెట్ వేశారు రంగస్థలం ఏర్పాటు చెయ్యబడ్డది—సెట్ లో ఒక భాగంగా కొబ్బరిఆకులు తోరణాలు కట్టారు రెండు పెట్రోమాక్సులైట్లు కర్రలకి కట్టబడి వెలుగుతున్నాయి రంగస్థలంలోని రంగస్థలంమీదకి ఓ ముతకగుడ్డలు ధరించిన వ్యక్తి వచ్చి "అయ్యా, ఇప్పుడు 'దశావతారాలు' భరతనాట్య ప్రదర్శన జరుగుతుంది తమరు దయచేసి నిశ్శబ్దంగా ఉండాలని కోరుతున్నాను" అని పక్కకి వెళ్ళిపోయాడు. రంగస్థలంమీద తబలా, హార్మోనియం, వయొలిన్ వాయిద్యాలని వాటి తాలూకు వాద్యగాళ్ళు సరిచూసుకొని శ్రుతి కలుపుకుంటున్నారు. ఇంతలో గజ్జెల రవళి వినిపించింది నేపథ్యంలో. వాద్యసంగీతం ప్రారంభమైంది ఒక ఎలజవ్వని రంగంమీదకి వచ్చి అందరికీ నమస్కరించి ప్రార్థన చేసింది.

గజ్జెలు ఘల్లు ఘల్లు మన్నాయి తబలా లయకలిపింది తధిత్తోం తదిగి తత్తోం భరతనాట్యం ప్రారంభమైంది

నేపథ్యంలో శ్రావ్యమైన కంఠం వినిపిస్తోంది ..
మత్స్యరమున మరియంబుధిలో బొచ్చియున్న
సోముని గ్రుంచియు
విద్యలనిడి వేదములొసగిన విచ్చితివో మత్స్యవతారా! ఇచ్చితివో మత్స్యవతారా!"

ముద్ర పట్టింది నర్తకి

చప్పట్లు చరిచారు ప్రశంసా పూర్వకంగా నేపథ్యంలో ప్రేక్షకులు...

కలుముల నిను ప్రస్తుతి సేయగ చెలగి సురలు
జలధి మధింపగ
కలిమి బలిమి చెలిమితో మోసిన మందరగిరిధర
కూర్మావతార!"

కూర్మావతార ముద్రపట్టింది నర్తకి.

నేపథ్యంలో ఓ వృద్ధస్వరం దర్పంగా వినిపించింది.

రెడ్డొచ్చె మొదలాడు.

రెడ్డొచ్చె రెడ్డొచ్చె మొదలాడు.

ఓ అజానుబాహు విగ్రహం రంగస్థలం మీదకి వచ్చి కోపంగా మండుతుంది బొమ్మ వేసిన చేతికర్ర ఊగిస్తూ.

ఆగిపోయింది నర్తకి. ఆగిపోయారు వాద్యగాళ్ళు. ఆగిపోయింది గానం. మరికొంతసేపటికి మళ్ళీ గజ్జెలు ఘల్లుమన్నాయి—తకధిం తక తాహా తకిట తక .

" విద్యలనిడి వేదము లొసగిన
ఇచ్చితివో మత్స్యవతారా!
నీ విచ్చితివో మత్స్యవతారా!"

మత్స్యవతార ముద్ర పట్టింది నర్తకి

చప్పట్లు మళ్ళీ వినిపించాయి ఆ చప్పట్ల చప్పుడు లోంచి గంభీర స్వరం వినిపించింది

పంతులొచ్చె మొదలాడు
పంతులొచ్చె మొదలాడు

మరో వ్యక్తి రంగస్థలంమీదికొచ్చి రెడ్డి ప్రక్కన నుంచున్నాడు దర్పంగా. రెడ్డి ముఖం చిట్లించాడు.

భరత నాట్యం మళ్ళీ మొదటికొచ్చింది .

"మత్స్యరమున మరియంబుధిలో "

నేపథ్యంలోంచి ఓస్వరం అధికారపూర్వకంగా హెచ్చరించింది.

చౌదరొచ్చె మొదలాడు
చౌదరొచ్చె మొదలాడు

నర్తకి నిస్సహాయంగా చూసింది. పట్టబోయే ముద్ర ఆగిపోయింది.

ఠీవిగా రంగంమీదకొచ్చాడు ఒక వ్యక్తి. పాట మొదటికొచ్చింది గజ్జెలులయ వేయసాగాయి.

" విద్యలనిడి వేదములొసగిన. ఇచ్చితివో మత్స్యవతారా! నీ విచ్చితివో మత్స్యవతారా!" నేపథ్యంలోంచి ఖంగున మోగింది ఓ గొంతు.

నాయుడొచ్చె మొదలాడు
నాయుడొచ్చె మొదలాడు.

రంగం మీదకి వచ్చి నలువైపులా చూసి మీసాలు మెలేసి నుంచున్నాడు మరో వ్యక్తి.

తిరిగి ప్రారంభమైంది భరతనాట్య కార్యక్రమం నర్తకి మత్స్యవతార ముద్రపట్టి పరవశంతో అలాగే నిలబడి పోయింది. ఇంతలో నేపథ్యంలో ఎవరో అరిచారు. నర్తకి తెప్పరిల్లింది.

"శ్రేష్ఠి వచ్చె మొదలాడు
శ్రేష్ఠి వచ్చె మొదలాడు

అందరికీ ఆశ్చర్యంతోపాటు ఆనందం కలిగించింది. ఎవరైనా ఈ ప్రసక్తి అతనిముందు తెస్తే అదేమీ ఘనకార్యం కాదన్నట్లు మాట్లాడతాడు.

ఇలాంటివి కొన్ని చెప్పుకోదగ్గ పనులు చెయ్యటంవల్ల అతనంటే ఊరివాళ్ళకి అభిమానం ఏర్పడ్డది. చిత్రమేమంటే ఇలా ఊళ్ళో తనని అభిమానిస్తున్నారనే విషయం అతని ఆలోచనలోకి రాదు. ఆ విషయం అతనికి తెలియదని కాదు. ఒక విధమైన నిర్లిప్తత అతని ముఖంలో ద్యోతకమవుతుంది. ఓసారి సభావేశంలో మూర్తిని గూర్చి ఈ మున్సబు ఎవరో ప్రశంసా వాక్యాలు పలికితే, వెంటనే లేచి అన్నాడు.

"నేనూ ఊరివాళ్ళలో ఒకణ్ణి. ఒకవేళ నే నేదైనా చేస్తే అందులో నే వాశ్చర్యకమేం లేదు. నాకు అవసరమనిపించిన పనులే నేను చేశాను. ఇందులో ప్రశంసించటానికేం లేదు."

మరొక వ్యక్తి ఈ మాటలంటే మర్యాదకోసం, స్వప్రతికోసం అన్నాడని సులభంగానే ఊహించే వాళ్ళు జనం. కాని ఆ మాటలు అన్నవాడు మూర్తి. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ తన్ను సూచించే మాట ఒక్కటి పలికినా ముఖం చిట్లించు కుని చిరాకుపడే ఒకే వ్యక్తి. పొద్దస్తమానమూ పని వాళ్ళతో పాటు నడుం వొంచి చాకిరిచేసి ఆపైన అలసటాయినా పొగతో గుండెమీద చేతులు ఆనించి చుక్కలు చూస్తూ నిలబడే కర్ర పెట్టినవాడు కాదు మూర్తి.

పడమటి ఆకాశం ఎర్రబారుతోంది. ఆ సమయంలో ఓ వ్యక్తి మూర్తిదగ్గరికివచ్చి 'నమస్తే' అన్నాడు. దగ్గర్లో ఉన్న చిరుచాపలాగి "కూర్చోండి" అన్నాడు. మూర్తి, ఆ వ్యక్తిని ఆపాదమస్తకం చూసి

"నేను కరణంగారి దగ్గర్నించి వస్తున్నానండీ" కూర్చుంటూ అన్నాడతను.

"అలాగా!"

"నా పేరు వెంకటపతి. ఈ సంవత్సరం నేను బి. ఏ. ప్యాసయ్యాను. మూర్తిగారు మీరేనా?"

"అవునండీ" అంటూ మూర్తి దగ్గర్లో ఉన్న కంచు మరచెంబులోని నీళ్ళు పంచపాత్రలో పోసి వెంకటపతి కిచ్చాడు. ఆ చల్లటి మంచితీర్థం తాగి అతను తను వచ్చినపని చెప్పాడు.

"కాలేజీలో చదువుతున్నప్పుడు నేను సంఘ సేవ చేసేవాడినండీ. కాలేజీ సాంఘిక సేవాసమితి సభ్యుణ్ణి. మొన్న ఆమధ్యన ఈ ఊరి మట్టిరోడ్డుమీద కంకర వేసిన బృందంలో నేనుకూడా ఉన్నాను. ఈ ఊళ్ళో నాకు చేతనైనంతవరకు కొన్నాళ్ళు సంఘసేవ చెయ్యాలని ఉందండీ"

"మంచిది" అన్నాడు మూర్తి

"ఏంచేస్తే బాగుంటుందంటారు?"

"నా కా విషయాలు తెలియవే"

"మీకు తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తాయి?"

"అలాగని ఎలా అంటారు?"

"కరణంగారు మీ విషయమంతా చెప్పారు. మీ సలహా తీసుకుని ఏదైనా చేస్తే బాగుంటుందని ఆయన చెప్పిన మీదటే మీ దగ్గర కొచ్చాను. మీరు సహాయపడతారని ఆశిస్తున్నాను"

"నావల్ల సహాయం జరిగే వీలుంటే సంతోషంగా చేస్తాను. కాని నేనేం చెయ్యగలనో నాకే తెలియదు. మీ కార్యక్రమమేమిటో సెలవివ్వండి"

"అది తయారు చెయ్యటానికే మీ సలహా అడుగుతున్నాను"

మూర్తి ఆలోచించాడు. ఆ క్షణంలో అవస రాన్నిబట్టి తోచిందేదో చెయ్యటమే గాని తనింత వరకూ ఫలానా ఫలానా వ్యవహారాలు ఫలానా విధంగా చెయ్యాలని ఆలోచించి ఆ కార్యక్రమం ప్రకారం నడపటం ఎరగడు

"మీరీ ఊళ్ళో స్థిరపడిపోతారా?"

"ఎబ్బె, లేదండి."

"ఎన్నాళ్ళుంటారు?"

"బి. ఏ. ప్యాసయ్యాను కదండీ. ఏదైనా ఉద్యోగం వస్తే వెళ్ళిపోతాను. ఈ లోపల వీలైనంత వరకూ నలుగురికీ పనికొచ్చే పనేదైనా చెయ్యాలని ఉబలాటం."

మూర్తి పొడిగా నవ్వాడు

"చెయ్యవచ్చు. దానికేం. కాని అర్ధాంతరంగా వెళ్ళిపోతే ఏంలాభం?"

"ఎవరికి?" అన్నాడు వెంకటపతి.

"ఊరికీ, మీకూ కూడా."

"జరిగినంత వరకు జరుగుతుంది."

## ఆరు

అని పద్మ లోపలికి వెళ్ళిపోయింది. విశ్వం చిరునవ్వు నవ్వుకున్నాడు ఎంతగా మారిపోయింది పద్మ! పూర్వం ఎరుపురంగంటే ఆమెకి అసహ్యం. ఇప్పుడు ఎరుపురంగు చీరలే కట్టుకుంటుంది ఇదివరకు అంత స్వేచ్ఛగా ఇంట్లో తిరిగేది. ఇప్పుడేమో ప్రతి దానికీ తడుముకుంటున్నట్టుగా ఉంటుంది. తనేమిటో ముభావంగా వచ్చినట్టు మాట్లాడుతుంది ప్రతి విషయంలో డాక్టర్ ఇష్టా ఇష్టాలు పాటిస్తుంది. ఇంతగా ఆమె తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోటం విశ్వానికి కొంచెం కష్టంగా ఉంది. ఈ మార్పులన్నీ ఎంతవరకు పద్మ తెచ్చిపెట్టుకున్నవో, ఎంతవరకు డాక్టర్ గారి ప్రభావం ఫలితాలో అతనికి తెలియవు. కాని ఇలా మారటం అంత సమంజసం కాదని తోస్తోంది అతనికి పద్మ నడిగితే ఈ విషయాలు చాలా తేలిగ్గా తోసేస్తుంది తనేం మారలేదని, ఒక వేళ మారినా ఆ విషయం విశ్వం చెప్పేదాకా తనకి తెలియదని అంటుంది.

[illegible] అయిపోయింది. పద్మ ప్రయాణం కట్టింది. విశ్వం తీసుకోనివ్వనన్నాడు వెళ్ళిపోతూ గోపికి పది రూపాయల నోటిచ్చింది పద్మ

"వాడికి మర్యాదలేమిటి?" అన్నారందరూ. కాని వాడు వెంటనే ఆ నోటు నిక్కరు జేబులో దాచుకున్నాడు అప్పుడప్పుడూ అక్కయ్య తనకిచ్చిన డబ్బులు చూసుకుంటుంటే అదో తృప్తిగా ఉంటుందని వాడికి ఆ సమయంలో అనిపించింది.

"స్త్రీలకి ఆర్థిక స్వాతంత్ర్యం లేదు" అన్నాడు విశ్వం

"అబ్బ మర్యాదలో అన్నయ్యా. నువ్వు ప్రతి దానికి వాదిస్తావు" అంది పద్మ.

విశ్వం మళ్ళీ నోరెత్తలేదు. తను వాదిస్తాడట! గంటలతరబడి తనతో పిడివాదం చేసుకుని ఉద్రేకం తెప్పించే పద్మేనా యీ మాటలు అన్నది!

హైదరాబాద్ లో డాక్టరుగారి ఇల్లు, ఆస్పత్రి కూడా నగరంలో ఒకచోట ఉన్నాయి. ప్రయాణపు బడలికతో కుర్చీలో కూలబడి "ఏమిటయ్యా, విసిరేసినట్టు ఇక్కడపెట్టావు మకాం?" అని రిమార్కు చేశాడు విశ్వం. శ్రీనివాసరావు నవ్వి ఊరుకున్నాడు.

ఆ సాయంత్రం శ్రీనివాసరావు తన డిస్పెన్సరీ చూపించాడు విశ్వానికి. నర్సింగ్ హోమ్ వేరేచోట ఉంది. ఇదీ, డిస్పెన్సరీ, నర్సింగ్ హోమ్ అన్నీ కలిపి ఒకచోట పెట్టుకుని సలహా ఇచ్చాడు విశ్వం.

"అలా అయితే చిక్కులున్నాయి" అన్నాడు డాక్టర్

"ఏమిటా చిక్కులు?"

"పొద్దస్తమానూ యీ రోగులగొడవతో నేను సతమతమవటమే కాక పద్మకూడా ఆ అవస్థ దేనికి?"

విశ్వం అసలువిషయాన్ని తప్పించి అన్నాడు.

"'రోగుల గొడవ' అని విసుక్కునేవాడివి నువ్వేం డాక్టరువయ్యావ్?"

"ఈ, ఎన్ టి స్పెషలిస్ట్"ని డాక్టర్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"అసలు ప్రశ్న తప్పించకు రోగులకు సేవచేసే అవకాశం లభించినందుకు సంతోషంతో ఆ పని చెయ్యాలిగాని విసుక్కోటం డాక్టరైనవాడికి ధర్మం కాదు. అంతో ఇంతో సంఘసేవ చెయ్యాలనే అభిలాష ఉన్న నాలాంటివాడికి కా అవకాశము దొరకదు. దొరికిన నీలాంటివాళ్ళు అసంతృప్తితో బాధ పడతారు. మనుషుల చిత్తప్రవృత్తుల్ని బట్టి ఉద్యోగాలు దొరికితే ఎంత బావుంటుంది!"

డాక్టరేమీ సమాధానం ఇవ్వలేదు. చిరునవ్వు నవ్వుతూ విశ్వంవైపు చూడసాగాడు డాక్టర్ సమాధానం చెప్పకపోవటంతో విశ్వానికి మరింత అవకాశం లభించింది తన వాగ్ధోరణి కొనసాగించటానికి

"ఒక్క ప్రశ్న అడుగుతాను చెబుతావా? తడుముకోకుండా సమాధానం చెప్పాలి"

"అడుగు."

డాక్టర్ కళ్ళలోకి గంభీరంగా చూస్తూ బాణంలా వొదిలాడు తన ప్రశ్న విశ్వం.

"నీ జీవితాశయం ఏమిటి?"

"గొప్ప డాక్టర్ని కావటమే"

గోలులోకి బంతిని తన్నినట్టు విజయసూచకంగా చూశాడు డాక్టర్. వెంటనే వచ్చిన ఆ సమాధానానికి ఓడిపోయిన గోల్ కీపర్ లా ముఖం పెట్టాడు విశ్వం.

"ఇంకొక ప్రశ్న ఈ నాలుగేళ్ళలో నువ్వు చేసిన ఒక్క మంచిపని చెప్పు, చూద్దాం"

డాక్టర్ ఆలోచించసాగాడు. విశ్వం విజయసూచకంగా ముఖం పెట్టాడు.

"చెప్పలేను. చూశావా, నీ ఇరవై అయిదేళ్ళ జీవితం స్వార్థంతో నిండి ఉందన్నమాట. అందుకని, డాక్టరుగారూ, ఈ విషయం మనసులో ఉంచుకుని మీరు రోగులతో మెలగండి."

డాక్టర్ విశ్వం బల్లమీద చెయ్యేసి నవ్వుతూ "నువ్వు సంఘసేవకుడివని, సంఘోద్ధారకుడివని నాకింతవరకూ తెలీదు. ఒక్కసారైనా చెప్పావు కాదేం?" అన్నాడు

ఆ మాటలు వినగానే విశ్వం ముఖం ముకుళించింది. తను చేసిన సంఘసేవ ఏమిటి? ఇప్పటివరకూ పూజ్యం 'సంవత్సరం పొడుగునా సంఘసేవ చేస్తావురో' అని ఉగాదినాడు మూర్తి అన్న మాటలు గేలి చేస్తున్నట్టనిపించింది విశ్వానికి.

విశ్వం హైదరాబాద్ వచ్చి మూడు నాలుగు రోజులైంది తొందరప్పుడు డిస్పెన్సరీలో, నర్సింగ్ హోమ్‌లో నిల్చి రోగుల్ని పరామర్శించి వస్తుండేవాడు. ఒకరోజు సాయంత్రం డిస్పెన్సరీనించి బరువుగా అడుగులు వేసుకుంటూ ఇంటికి వచ్చాడు. అతనదోవిధంగా ఉండటంచూసి పద్మ కారణం అడిగింది. ఏం లేదన్నాడు. ఏదో ఆలోచిస్తూ వాలుకుర్చీలో పడుకున్నాడు.

డాక్టరు మామూలుగా రాత్రిపూట ఎనిమిది కొట్టగానే ఇంటికి వస్తాడు. ఆ రోజు రాత్రి ఎనిమిది దాటినా ఇంకా రాలేదు.

"నువ్వు భోజనానికి లే అన్నయ్యా. నీకు ఆలస్యమవుతోంది. వారు తరవాత భోజనంచేస్తారు." అంది ఆమె

"ఆకలి లేదులే" అన్నాడతను.

తొమ్మిది దాటింది.

"డాక్టర్ అప్పుడప్పుడు ఇంటికి ఆలస్యంగా వొస్తారా?"

"అవును. ఒక్కొక్కసారి పన్నెండుకూడా అవుతుంది."

"అప్పటివరకూ ఎక్కడుంటాడు."

"గొప్ప ప్రమాదపు కేసులుంటే అలాగే అక్కడే ఉండిపోతారు."

"ఎవరు చెప్పారా సంగతి?"

"వారే"

"నిజమో కాదో కాంపౌండర్ని అడిగావా?"

పద్మముఖం ఎర్రబారింది.

"నాకేం అవసరం?" అంది.

"భర్తగనకనే!" అన్నాడతను.

"ఏమిటి నువ్వు మాట్లాడేది?"

"డాక్టర్ గారికి గడ్డిపువ్వుమీద మోజెక్కి గిందిలే."

"అంటే?"

"నువ్వంటే శ్రీనివాసరావుకి నిజంగా ఇష్టమేనా?"

పద్మ కొంచెం విసుగా తలదించింది.

"పద్మా, డాక్టర్ నువ్వనుకున్నంత మంచివాడు కాడు."

"ఛాస్తే. మళ్లీ అనకు అలాంటిమాట" అంది పద్మ కోపంగా.

"డిస్పెన్సరీలో అందరూ అనుకుంటే ఆయనకి నర్సుతో సంబంధముంది అందుకే ఆలస్యంగా రావటం"

"ఛీ" అంది పద్మ అసహ్యించుకుంటూ. "పాపపు కారా. అలాంటివి నువ్వెలా నమ్మావు?"

"పుకారయితే మంచిదేగాని దురదృష్టవశాత్తూ అది పుకారు కాదని నా నమ్మకం. ఆయన నర్సుతో కిలకిలనవ్వటం నేను చూశాను"

"ఆయన అందరితో అలా మనస్ఫూర్తిగా నవ్వుతూనే మాట్లాడతారు. తాడూ బొంగరం లేని మాటలు నాకు చెప్పకు. నేను నమ్మను ముమ్మాటికి నమ్మను. నమ్మలేను"

ఆవేశంగా అంది పద్మ. కంట కన్నీరొలికింది. ఆమెవైపు జాలిగా చూశాడు విశ్వం.

"నువ్వు దొరకటం డాక్టర్ అదృష్టం. అందంలోగాని, గుణంలోగాని, తెలివిలోగాని డాక్టర్ నీకు తీసికట్టు పద్మా. డాక్టర్ బావుండడని నాకు తెలుసు, నీకు తెలుసు, అందరికీ."

పద్మముఖం కెంపురించింది. ఆమె విశ్వం వైపు చూసింది.

"నీకేమీ తెలియదు మనిషంటే మనసూ, మాటా హృదయమూ. అంతేకాని నాకేమీ మనిషి గురించి తెలియదు. వారికంటే అందమైనవాళ్ళు ఎవరూ లేరు"

ఈ మాటలు మెత్తగా అతి సహజంగా ఏదో సత్యాన్ని చాటే విశ్వాసంతో అంది పద్మ.

విశ్వం మరేమీ మాట్లాడలేదు. ఇటువంటి పద్మని తానెరగడు. పద్మ అంత శక్తి తనకి కనిపించటం

కమల కళ్లొత్తుకుని, తలదువ్వి రక్తపు మరకచీర చేతులతో కుదుపుకుంటుంది—వెళ్లు కొంచెం తరవాత సరోజ వస్తుంది

సరోజ (చిరునవ్వుతో) మీకు నేనేం అంతరాయం కలిగించలేదు కదా?

రామం (పుస్తకం ఉంచి) కలిగించేవ్—

కమల: లే లేదు

సరోజ (వెళ్ళిపోతూ) మళ్ళీ పారొస్తా—ఓసారి ఎలా ఉన్నావో చూసిపోదామని

రామం చూసేవు కద

సరోజ (నవ్వడానికి ప్రయత్నిస్తూ) ఏదీ ఇంకా ఇలా ఒస్తున్నాను

రామం నే అనుకుంటేను కదా

సరోజ ఔను

రామం చూసినట్టేకదా?

సరోజ ఊఁ

రామం ఎలా ఉన్నాను?

సరోజ ఏమిటా ప్రశ్న?

రామం క్యూరియాసిటీ కొద్ది చూసిపోదామని వచ్చేవ్—

సరోజ అదేం మాట? స్నేహితులని చూడరూ?

రామం చూసి ఒక అభిప్రాయం మనసులో ఏర్పరచుకొని, ఒక చిత్రం చిత్రించుకుని గప్ చుప్ గా పోదామనుకున్నావా?

సరోజ (వచ్చి స్టూల్ మీద కూచొని) అనుకున్నా అనుకోపోయినా ఒక మనిషిని కాని, దగ్గర స్నేహితుణ్ణి కాని చూసినప్పుడు అభిప్రాయం ఏర్పడదూ?

రామం దగ్గర స్నేహితుణ్ణి చూస్తే కొత్త అభిప్రాయాలేముంటాయి?

సరోజ కులాసాగా ఉన్నాడనో చిరాగ్గా ఉన్నాడనో

[కమలని ఇద్దరూ గమనించరు—కమల లోనికి వెళ్తుంది]

రామం: ఆకర్షణీయంగా ఉన్నాడనో, వికటంగా ఉన్నాడనో

సరోజ ఔను. ఓ నిముషం వికటంగా అనిపించిన వ్యక్తి, మరో గంటలో అతడన్న ఒకమాటవల్లో, బట్టల మార్పువల్లో ఆకర్షణీయంగా కనిపించవచ్చు.

రామం అలాగే ఓసారి ఆకర్షణీయంగా ఉన్నతను వికటంగానూ ఉండొచ్చు—

సరోజ (నవ్వి) నాకది అనుభవం

రామం ఎవరి సంగతి

సరోజ: కొందరిగురించి మనం పెద్ద అభిప్రాయం ఏర్పరచుకుంటాం—ఆత్మీయులైన స్నేహితులుంటారు కొన్ని ప్రత్యేక పరిస్థితులని ఎదుర్కోవాల్సి వచ్చినప్పుడు వారి బలహీనతలు, సంకుచితత్వం, వారన్న ఒక మాటవల్లో, ముఖంలోని భావం వల్లో ఒక్కసారిగా బయట పడిపోయి దురదృష్టవశాత్తూ మనం అక్కడుండడం తటస్థిస్తే ఆ వ్యక్తిలో మనకున్న ఆకర్షణపోగా, అసహ్యం కూడా కలుగుతుంది.

రామం మాటవరసకి నేను—

సరోజ నీకేం మహారాజులా ఉన్నావ్

రామం (ముఖం వికసించగా పాతకోసంగ కూచొని) ఎలా ఉన్నాను?

సరోజ ఎప్పటిలాగే ఉన్నావ్

[కమల వస్తుంది—ముఖంలో ఇదివరకటి కన్నీటి చారలు లేవు—తల దువ్వుకుంది]

రామం నువ్వు అన్న ఏ ఒక్క బలహీనత కాని, సంకుచితత్వం కాని (కమలవైపు చూసి) మరేదన్నా కాని

సరోజ ఉంటే ఉండొచ్చు బలహీనతలు, కానప్పుడు ప్రస్ఫుటం చెంది మాత్రం కావు

రామం నీకేం తెల్సునా బలహీనతలు—

సరోజ: తెల్సినంత మట్టుకు

రామం అయితే నే ఇంక జాగర్తగా ఉండాలి అంటేనా? మరేం అనిపించలేదే నన్ను చూడగానే?

సరోజ నా రాకడం ఇష్టంలేదనిపించింది, పోదాం అనుకున్నాను

రామం ఏదీ ఇష్టం లేకపోయినా వచ్చి, వచ్చిన పనయింది కాబట్టి పోదామనుకున్నావ్.

సరోజ ఏమిటా పని ?

# కలగూరగంప

## నాగరికత

శ్రీ నాగభూషణం

సంఘ జీవనము సమస్త ప్రాణికోటిలో కన్పించే సహజలక్షణం బలీయమైన అవసరం కూడా. స్వజాతి సంబంధించిన జీవులన్నీ ఒక కూటమిగా జీవించడం మనం తిలకిస్తూ ఉంటాం. కోతులు ఒక కూటమిగా, భ్రమరాలొక కూడికగా, మత్స్యములు మరొక కూటమిగా ఉండటం మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. పైన పేర్కొనిన "స్వజాత్యాకర్షణ" మానవునిలో కూడ ఉండే సహజ లక్షణం. ప్రయోజనం దృష్ట్యా, సంఘజీవన బద్ధత ఆవశ్యకతను, మానవుడు మరింత గుర్తించాడు. పరస్పర సహకారం సహకారాలే మానవ జీవితాలను సుభ్రపదం చేస్తాయి. ఐకమత్యం సుసాధ్యం కావాలంటే మానవుడు తప్పనిసరిగా కొన్ని నియమ నిబంధనలను అనుసరించవలసి ఉంటుంది. కాలగమనంతో పాటు మానవజీవిత అవసరాలు పెంపొందుతూ ఉంటాయి. జీవితావసరాలను సాధించే ప్రయత్నములో నాగరికత పురోగమిస్తూ ఉంటుంది. జీవితం మరింత సుఖవంతము చేసుకోవాలనే తీరని కాంక్ష, కళాతృష్ణ నాగరికతా పురోభివృద్ధికి ఆధారభూతాలు.

నాగరికతకు ఒక రూపాన్ని ఆపాదించి, ఆ ప్రత్యేక రూపమే "నాగరికత" అని ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టం. జాతి, జాతికీ, దేశదేశానికీ మధ్య నాగరికతా స్వరూప స్వభావాలలో వైవిధ్యం ఉండి తీరుతుంది.

వారి వారి, దేశ కాల పరిస్థితులు కళాదృష్టి, అవసరాలు, అభిరుచులు, వైఖరి దృక్పథ ప్రభావంవలనగా, నాగరికతా స్వరూప స్వభావములలో వైవిధ్యం ఉంటున్నది. అందువలననే ఒక జాతి లేక ఒక దేశ నాగరికతే ఉత్కృష్టమైనదని నిర్ణయించడం కష్టం. ప్రయోజనం దృష్ట్యా, కళాదృష్ట్యా, ఒక నాగరికత, ఉత్కృష్టత సాపేక్షంగా మాత్రం, నిర్ణయించవచ్చును. ఈ విధంగా కూడా ఒక నాగరికత ఉత్కృష్టతను నిర్ణయించే సమయములో, వారి వారి దేశకాల పరిస్థితులు, అవసరాలు, అభిరుచులు, వైఖరి దృక్పథులను, మనం దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. మానవుని "భౌతిక సాధన, సంపద, సౌఖ్యాల"నే నాగరికత అని స్థూలంగా నిర్వచించవచ్చును.

ప్రస్తుతం మనం నాగరికతగా పరిగణించే విషయాన్ని రెండు భాగాలుగా విభజించవచ్చును (1) భౌతిక నాగరికత (2) అభౌతిక నాగరికత

### భౌతిక నాగరికత

పంచేంద్రియాలద్వారా గ్రహింపబడునది భౌతికము. మానవ నిర్మితమైన భౌతిక సాధనే "భౌతిక నాగరికత" గృహనిర్మాణము, వస్త్రోత్పత్తి, ఆహారోత్పత్తి వగైరాలను మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. మానవావసరములు రెండు రకములు (1) మూలావసరములు (2) కల్పితావసరములు. మూలావసరములు జీవించుటకు తప్పనిసరి అయినవి. ఆహారము, నీళ్లు, గాలి వగైరాలను మూలావసరములుగా పేర్కొనవచ్చును. వస్త్రధారణ, గృహవాసము వగైరాలను కల్పితావసరములుగా పేర్కొనవచ్చును. కల్పితావసరములు లేకున్నను మానవుడు జీవించగలడు.

మానవప్రయత్న ప్రమేయం లేకుండా ప్రకృతి ప్రసాదితమైన ఆహారముతోనే ఆదిమానవుడు జీవించేవాడు. కాలగమనంతో పాటు ఆహారపు కొరత యేర్పడినది. ఆ కొరతను తీర్చుకొనుటకు మానవ ప్రయత్నాన్ని మేళవించి, ప్రకృతిని వినియోగించుకోవలసి వచ్చింది. ఈ విధంగా మూలావసరాలే నాగరికతా పురోభివృద్ధికి ప్రథమ సోపానమైనది. కల్పితావసర సాధన సంపత్తే నాగరికతకు ద్వితీయ సోపానము. జీవితాన్ని

